## పంటల భీమాపద్ధతి

### అమలుకు మద్రాసు అసమ్మతి

న్యూఢిల్లీ, జులై 3: బొంబాయి, సి. పి. మద్రాసు, యు. పి. రాష్ట్రాలలో పంటల భీమాపద్ధతిని ప్రవేశపెట్టడం యోగ్యమా అన్న కేంద్రం సూచన పట్ల ఈ రాష్ట్రప్రభుత్వాలు అసమ్మతిని వెల్లడించాయి.

భారతీ వ్యవసాయక పరిశోధనసంస్థ వారు చేసిన సిఫార్సును కేంద్రం ఆయా రాష్ట్రాలకు అందజేసింది. ఆర్థికమైన కారణాలను పురస్కరించుకొని, ఆయా ప్రభుత్వాలు ఆ సూచనను ఆమోదించలేక పోయినాయి.



## గంటల పంచాంగం

ఖర సం॥ ఆషాఢ శు॥ తృతీయ
1951 సం॥ జులై 7 శనివారం
శు॥ తృతీయ రా 7-37 ఆశ్లే రా 12-36
వర్జ్యం ప 12-16 ల 1-2 కు.
శు॥ నవమి జులై 8 ఆదివారం
ఆ॥ నవమి రా 9-11 మఖ రా 2-42
వర్జ్యం ప 1-39 ల 3-23 కు.


# ఆంధ్రపత్రిక

ఒరుచేయది ...
యుద్దములు తన మువంబున కగు నా
పౌరుష పరిసేయుటనికి వరాయిటము
వరముదర్మ(చరితము) ...(మహాభారతము)

ఖర సం॥ ఆషాఢ శు॥ తృతీయ
శనివారం


## కొరియా యుద్ధ విరమణ చర్చలు

చైనా, కొరియా కమ్యూనిస్టు సేనానులతో యుద్ధవిరమణకు సంబంధించిన ప్రాతిపదిక సంప్రతింపులు జరుపుటకు సమితి సర్వసేనాని ప్రతినిధులు నేడు కేసాంగ్‌కు ప్రయాణమైరి. కొరియాలో శాంతి స్థాపనకు తొలిచర్యగ యుద్ధమును విరమించుటకు అవకాశము గలదని సోవియట్ రష్యా వెల్లడించగనే అట్టి అవకాశ పరిశీలనకు తాము కూడ సిద్ధముగనే యున్నట్లు బ్రిటన్, అమెరికా స్పష్టము చేసెను. ఆ ప్రకారముగ యుద్ధవిరమణ సంప్రతింపులు జరుపుటకు తేదీ, స్థలములను నిర్ణయించి కొరియాలోని సమితి సర్వసేనాని కమ్యూనిస్టు సేనానులకు ఆహ్వానము పంపెను.

చైనా, ఉత్తర కొరియా సేనానులు జనరల్ రిడ్జ్‌వే ఆహ్వానమును అంగీకరించి సంప్రతింపులు 38 వ అక్షాంశ రేఖ-ఉత్తర, దక్షిణ కొరియా సరిహద్దుపై కేసాంగులో జరుగవలెనని, అట్టి సంప్రతింపులు జులై 10-15 తేదీలమధ్యను జరుగవచ్చునని ఎదురు ప్రతిపాదనలనుచేసెను. కమ్యూనిస్టులు కేసాంగును సమావేశస్థలముగ సూచించుటకు రాజకీయ కారణము లున్నవనుట నిస్సందేహము. సంవత్సరము యుద్ధము చేసినతరువాత ఉత్తర కొరియా దక్షిణ ప్రాంతమును ఆక్రమించలేకపోగా ఉత్తర కొరియాలో కొంత భాగమును కోల్పోవుట జరిగిన కింసుంగు ప్రభుత్వము నైతికముగ, రాజకీయముగ పతనమందు ప్రమాదము ఏర్పడగలదు. ఇంతదీర్ఘ యుద్ధముచేసిన తరువాత అయినను యధాస్థితికి భంగము కలుగకున్న దక్షిణ కొరియా దురాక్రమణను జయప్రదముగ ప్రతిఘటించి వుత్తర ప్రాంతమును రక్షించుకల్గితిమని చెప్పుకొనవచ్చును.

గత సంవత్సరము జూన్ 25 న ఉత్తర కొరియా దురాక్రమణ యుద్ధమును ప్రారంభించుటకు పూర్వము ఉండిన స్థితికి భంగము కలుగని రాజీ సంప్రతింపులకు తాము సిద్ధముగ నున్నట్లు కొరియాలో కమ్యూనిస్టు దురాక్రమణను ప్రతిఘటించుచున్న రాజ్యములన్నియు ఇదివరకు అనేక పర్యాయములు ప్రకటించి యుండెను. జనరల్ మెక్ ఆర్థర్ సమితి సర్వసేనానిగ నున్నపుడు కూడ కమ్యూనిస్టులు చైనా సర్వసాధారణమును వారిం ...సని సమీపము ... యుద్ధచర్యలను విరమించవలెనని హెచ్చరించెను. కాని ఇంతవరకు అట్టి యుద్ధచర్యల విరమణకు చైనా సమ్మతించి యుండలేదు.

ఇపుడు కమ్యూనిస్టులు తమంతట తాము యుద్ధవిరమణకు ప్రతిపాదనలు చేయుటవలన వారి అంతరంగిక ఉద్దేశ్యములను అనుమానించవలసి యుండును. బ్రిటన్, అమెరికాలుగాని ఇతర సమితి రాజ్యములుగాని అట్టి అనుమానములతో మాలిక్ ప్రతిపాదనలను తిరస్కరింపక తమ పూర్వపు ప్రకటనల ప్రకారము రాజీ సంప్రతింపులకు అంగీకరించిరి.

రేపు కేసాంగ్‌లో ప్రారంభమగు ప్రాతిపదిక సంప్రతింపులు ఫలప్రదమై యుద్ధవిరమణపై సమగ్ర చర్చలకు అవకాశ మేర్పడవచ్చును. ఈ లోపున అట్టి చర్యలు సఫలమగుటకు వీలుగ ఇరుపక్షములు సైనిక చర్యలను విరమించు అవసరము. నేటివరకు యుద్ధరంగమంతట సంఘర్షణలు జరుగుచునే యున్నవి. ఈ వాతావరణములో జరుగు యుద్ధవిరమణ సంప్రతింపులు ఫలప్రద మగుటకు ఎక్కువ అవకాశములుండవు. అధమము రేపు కేసాంగ్‌లో చర్చలు ప్రారంభమగుటతో నైన ఇరుపక్షములవారు యుద్ధ చర్యలు విరమింప వలెను. అట్లుగాక కమ్యూనిస్టులు ఈలోపునయుద్ధ చర్యలను తీవ్రతర మొనర్చిన, వాస్తవముగ యుద్ధ విరమణ జరిగిననాడు ఏ ప్రాంతముఎవరి అధీనమునున్న ఆ ప్రాంతము వారికే చెందవలెననిగాని, లేక యుద్ధమును మాత్రము విరమించి తదనంతర సమస్యల పరిష్కార మునకు జరుగు ప్రయత్నములలో ప్రతిష్టంభనమును ఏర్పరచి తద్వారా ప్రయోజనమును పొందుటకు కమ్యూనిస్టులు ప్రయత్నించుచున్నట్లు భావింపవలసి యుండును. కేసాంగులోజరుగు సంప్రతింపులలో ప్రప్రథమముగ ఈ విషయములపై ఒడంబడికను కుదుర్చుకొనుట అత్యంతావశ్యకము.

## కొరియాలో యుద్ధ మర్యాదల పరిగణన

### విమర్శలకు వారెన్‌ఆస్టిన్ సమాధానం

ఐక్యరాజ్య సమితి, జులై 6: ఐక్యరాజ్య సైన్యాలు కొరియాలో యుద్ధమర్యాదలు పాటించటం లేదంటూ అంతర్జాతీయ మహిళాసంస్థ (కమ్యూనిస్టులసంస్థ) చేసిన ఆరోపణ సత్యదూరం అనీ, ఐక్యరాజ్య సైన్యాలు 1949 వ సంవత్సరపు జెనీవా ఒడంబడికను అక్షరాలా పాటిస్తున్నాయనీ, కమ్యూనిస్టులే అంతర్జాతీయ రెడ్‌క్రాస్ సంస్థను తమ ప్రాంతంలోకి రానివ్వకుండా అడ్డుపెట్టి యుద్ధ మర్యాద భంగానికి పాల్పడ్డారనీ, అమెరికా ప్రతినిధి వారెన్ ఆస్టిన్ తన ప్రత్యుత్తరంలో ఈవేళ తెలియజేశాడు.

అంతర్జాతీయ మహిళా ఫెడరేషన్ పంపిన ఆరోపణలు పత్రాన్ని భద్రతా మండలి అధ్యక్షుడు జాకొబ్ మాలిక్ ఐక్యరాజ్య సమితి తాలూకు వివిధ దేశాల ప్రతినిధులకు ఈ మధ్య పంచిపెట్టించారు. సమితి కార్యదర్శి ట్రిగ్వేలి కోరిక మేరకు వారెన్ ఆస్టిన్ ఆ ఆరోపణలకు ఈ ప్రత్యుత్తరం వ్రాశాడు.

### జి. సన్యాసిరావు [ఎం. ఎల్. ఏ.] గారి రాజీనామా

మద్రాసు, జులై 6: జి. సన్యాసిరావు (ఎం. ఎల్. ఏ.) గారు దిగువ విధంగా ఒక ప్రకటన చేశారు:

"నేను గత మే 11 వ మద్రాసు శాసనసభలోని నా సభ్యత్వానికి రాజీనామాను మద్రాసు ముఖ్యమంత్రి గారికి అందచేశాను. వారు నాలేఖను స్పీకరు గారికి పంప నిరాకరించారు. ఆ కారణంగా యీవేళ నేను నా రాజీనామా లేఖను స్పీకరుగారికి యిచ్చాను. నా శాసనసభ్యత్వంతోపాటుగా రాష్ట్ర కాంగ్రెసు సభ్యత్వానికికూడా రాజీనామాను యిచ్చాను. గాంధీమహాత్ముని, నిర్మాణకార్యక్రమం, నా కిచ్చిన ఆదేశాన్ని అనుసరించి లోకసేవాసంఘంలో చేర నిశ్చయించుకొన్నాను."

## అట్లాంటిక్ రక్షణసన్నాహాలకు అవాంతరాలు

### లండన్ వర్గాల అభిప్రాయం

లండన్, జులై 6: అట్లాంటిక్ ఒప్పందంలో చేరిన 12 దేశాల రక్షణ సన్నాహాలన్నిటికీ సంబంధించిన ఒక సమగ్ర బడ్జెట్‌ను ఏర్పాటు చేయట మన్నది ప్రస్తుతం అట్లాంటిక్ రక్షణ సన్నాహాలను అడ్డగిస్తున్న అంశాలలో ప్రధానమైనదని ఇక్కడ అధికార వర్గాలు చెపుతున్నారు.

రెండవ ఆటంకం మధ్యధరా, మధ్యప్రాచ్య ప్రాంతాలకు, అధిపత్యాలను ఏర్పాటు చేయటమనీ, అట్లాంటిక్ రక్షణలో పశ్చిమ జర్మనీ ఎంతవరకు పాల్గొనాలన్నది మూడవ అంతరాయమనీ వారు చెపుతున్నారు.

ఇక్కడ ఉన్న అట్లాంటిక్ ఒప్పందపు కేంద్ర కార్యాలయానికి చెందిన ఒక ఉద్యోగి 'వ్యవహారాలు మనం అనుకున్నంత చురుగ్గా సాగటంలేదు. ఏ నిర్ణయం చేయబోయినా అన్ని ప్రభుత్వాలను సంప్రదించవలసి వస్తున్నందువల్ల ఆలస్యం అవుతున్నది' అని నేడు వెల్లడించారు.

ఖర్చుల విషయమై అంగీకారం కుదరకపోవటంవల్ల ఇంతవరకూ పశ్చిమ యూరపులో విమానాశ్రయ నిర్మాణ కార్యక్రమం నిలిచి పోయినదని రాజకీయవర్గాలు తెలియ జేశాయి.

యుగోస్లావియాకు ఆర్థిక సహాయం చేయవలెనని తమ ప్రతినిధులు చేసిన సూచనలకు బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికాలు అంగీకరించినవని బ్రిటిషు విదేశాంగమంత్రి మారిజన్ నేడు కామన్సులో వెల్లడించారు. కమ్యూనిస్టు దేశాల ఒత్తిడిని ప్రతిఘటిస్తున్న యుగోస్లావియాను బలపరచటానికి ఈ ప్రభుత్వాలు విశేష ప్రాధాన్యతను ఇస్తున్నవనీ, అయితే ఆ సహాయానికి రాజకీయ బంధనాలు తగిలించ ఇష్టపడటంలేదనీ ఆయన తెలియజేశారు.

ఈసహాయ కార్యక్రమంకిందఆయుధాలుకూడా సప్లయి చేయబడతవా అని ప్రశ్నించగా, మామూలుగా అన్ని దేశాలవలె యుగోస్లావియా కూడా ఆయుధాలు కొనుక్కొంటుందని జవాబిచ్చారు.

### మధ్యప్రాచ్య రక్షణ

మధ్యప్రాచ్య రక్షణకై శాంతిసమయంలో కావలసిన బలాలనుపంపే విషయమై ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, దక్షిణాఫ్రికాలు ఇప్పుడు ఆలోచిస్తున్నవని ఒక అధికారవర్గం నేడిక్కడ వెల్లడించినది. కిందటి నెలలో జరిగిన కామన్వెల్తు రహస్య సమావేశంలో మధ్యప్రాచ్య రక్షణకు సంబంధించిన ముఖ్య సూత్రాలకు రక్షణ మంత్రులు అంగీకరించారనీ, ఇంకా నిర్ణయాలు మాత్రం జరగలేదనీ ఆవర్గం తెలియజేసినది.

## తృతీయ ప్రపంచ సంగ్రామ ప్రమాదం

### తొలగలేదని అమెరికా రక్షణ శాఖాధికారి ప్రకటన

వాషింగ్టన్, జులై 5: "కొరియాలో శాంతి నెలకొన్నప్పటికీ తృతీయ ప్రపంచ సంగ్రామప్రమాదం తప్పిపోయిందని భావించటానికి వీలులేదు. సోవియట్ సామ్రాజ్యం సరిహద్దున వున్న ప్రాంతాల్లో ఎక్కడో అక్కడ యుద్ధం ప్రజ్వరిల్లే ప్రమాదం ఎప్పుడూ వుంటూనే వుంటుంది. కాబట్టి అమెరికా తన సైనికాభివృద్ధి కార్యక్రమాన్ని అవ్యాహతంగా కొనసాగించుకుంటూ పోవాలి" అని అమెరికా రక్షణ సమీకరణ డైరెక్టరు చార్లెస్ విల్సన్ తన ద్వితీయ త్రైమాసిక నివేదికలో వుద్ఘాటించాడు.

"కనీసం ఇంకో రెండేళ్ల పాటైనా సామర్థ్యం పనిచేస్తేనేగాని మనం పెట్టుకున్న లక్ష్యాలను అందుకోలేము. మన మిత్రరాజ్యాలు బలపడటానికి యింకా ఎక్కువకాలం పడుతుంది. మరి కొంతకాలంవరకూ ధరలను ఇలాగే కంట్రోలుచేస్తూ వుండాలి; పన్నులుకూడా అధికంగా విధిస్తూ వుండాలి. ఇంతవరకు సాధించిన పురోగమనాన్ని సమీక్షిస్తూ ఆయన ఈ క్రింది విషయాలను వెల్లడించారు:—

"35 లక్షల సాయుధ సైన్యాన్ని తయారు చేయాలన్న మన సంకల్పం యించుమించు నెరవేరినట్లుగా చెప్పవచ్చును.

పెద్ద ఎత్తున ఆటంబాంబులు తయారు చేయబడుతున్నాయి. రేడియో చోదితమైన అస్త్రాలు, అణుశక్తితో నడిచే జలాంతర్గాములు, రేతిస్కులలో ఉపయోగించేందుకు ఆటంబాంబు సప్లై తయారు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

నిరుటికంటే ఈ సంవత్సరం విమానాల ఉత్పత్తి నాలుగురెట్లు ఎక్కువ అయింది. వచ్చే సంవత్సరం ఉత్పత్తిని యింకా పెంచడానికి ప్రయత్నం జరుగుతుంది.

6 ఇంజన్లుగల ఒక బృహద్విమానాన్ని, ఒక మధ్యరకం టాంకును గాని 400 మంది మనుష్యలను గాని ఒకేసారి మోసుకొని పోగలిగిందానిని నిర్మించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. కొత్తరకం టాంకులు తయారు అవుతున్నాయి. రిజర్వులో వున్న 268 ఆయుధ సామగ్రి ఫ్యాక్టరీలలో సగానికిపైగా పని ప్రారంభించాయి. త్వరలోనే ఇంకా 66 ఫ్యాక్టరీలలో పని మొదలు పెట్టటం అవుతుంది. కొరియా యుద్ధం ప్రారంభమైన దగ్గర్నుంచి ఇప్పటివరకూ 4200 కోట్ల డాలర్ల ఆయుధ సామగ్రికి ఆర్డర్లు ఇవ్వబడ్డాయి. ఈ ఏడు పెట్రోలు ఉత్పత్తి నిరుటికంటె సగానికి పైగా ఎక్కువ అయింది.

దేశ ఆర్థిక వ్యవస్థను బలపరచటానికి కాంగ్రెసు తీవ్రమైన శాసనాలు చెయ్యాలని విల్సన్ విజ్ఞప్తి చేశాడు.

## ఎ. ఐ. సి. సి. బెంగుళూరు సమావేశం

### చర్చకు రానున్న అంశములు

న్యూఢిల్లీ, జులై 5: బెంగుళూరులో రాబోవు వారం జరుగనున్న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ, ఏ. ఐ. సి. సి. సభలలో నాల్గు సంవత్సరముల క్రిందట కాంగ్రెసువారు ఓటర్లకు చేసిన వాగ్దానాలు, ఈ నాల్గు సంవత్సరాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏ వాగ్దానాలను చెల్లించినవి, ఏ వాగ్దానాలను చెల్లించజాలక పోయినవి అను విషయము చర్చకు వస్తుందని అనుకొంటున్నారు.

కాంగ్రెస్ ప్రభుత్వములు సాధించగలిగిన దానిని, సాధించలేక పోయిన దానిని, లక్ష్యమును సాధించుటలో కాంగ్రెస్ ప్రభుత్వాలకు కలిగిన యిబ్బందులను జనరల్ ఎలక్షన్లకు పూర్వము దేశ ప్రజలకు నివేదించుటకుగాను యిట్టి సింహావలోకనము అవసరమని చెప్పుచున్నారు. ఈ సందర్భాన కాంగ్రెస్ కార్యదర్శి మోహనలాల్ గౌతమ్ గారు ఇలా అన్నారు: ఇటీవల చాలామంది కాంగ్రెస్ నుండి రాజీనామాలిచ్చారు. ఈ సమస్య విచారింపవలసి యున్నది. దీనితోబాటు కాంగ్రెస్‌పార్టీ విధానాలను కాంగ్రెసుపార్టీవారు యేంతవరకు అమలుచేశారో విచారించవలసి యున్నది. ఈ రెంటి విచారణ సందర్భమున కాంగ్రెస్ ప్రాతిపదిక లక్ష్యాల విషయమై చర్చ జరుగవలసి వుంటుంది. 1947 సం॥ము వరకు కాంగ్రెసు స్వాతంత్ర్య తత్వము నెదుర్కొనే సంస్థగా వుండెను. కాంగ్రెస్ వాదులందరు ఒక్కటివలె వ్యవహరించుచుండిరి.స్వాతంత్ర్య స్థాపనానంతరము కొందరు కాంగ్రెస్‌వాదులు ఏటికి తీసినయెడల, కొందరు కోటికి తీయుట సంభవించినది. కనుక మారిన పరిస్థితుల దృష్ట్యా కాంగ్రెస్ పార్టీ ఎన్నికల ప్రణాళికను తయారు చేయవలసి యుండును"

కనుక ఈ నాల్గు సంవత్సరముల పరిపాలనాను భవం దృష్ట్యా కాంగ్రెస్ విధానాన్ని ప్రకటించే విషయము ఏ. ఐ. సి. సి. కి పూర్వము జరుగు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ మూడు రోజుల చర్చలలో ప్రాధాన్యము వహించ వచ్చును.

కాంగ్రెస్ ఐక్యమునకు, కాంగ్రెస్ వాదులను కాంగ్రెస్‌నుండి పడిపోకుండా చేయుటకు బెంగుళూరులో ఎట్టి ప్రయత్నములు జరుగునో స్పష్టంగా తెలియుటలేదు. ఐనప్పటికీ కాంగ్రెస్ ఐక్యతకు సంబంధించినచర్య వ్యక్తిగతంగా వుండదని కేవలము లక్ష్యమునకు సంబంధించినదిగా వుంటుందని విశ్వసింపబడుతున్నది.

### ఏ. ఐ. సి. సి. సభకు సన్నాహాలు

బెంగుళూరు, జులై 5: ఏ. ఐ. సి. సి. సభకు సన్నాహాలు ప్రారంభమైనవి. జనరల్ ఎలెక్షన్లకు సంబంధించిన సమస్యలను చర్చించడానికి వివిధ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీల అధ్యక్షులు జులై 14 న సమావేశమవుతారు. కృత్రిమ సుబియ్యము, కల్తీపిండలను నుండి తయారు చేసిన ఆహారపదార్థాలను కేంద్రసాంకేతిక పరిశోధన సంస్థవారు ప్రదర్శిస్తారు. మైసూరులో వుండగా ఈ పరిశోధన సంస్థను ప్రధాని నెహ్రూగారు దర్శిస్తారు. ప్లానింగ్ కమిషను ఉపాధ్యక్షుడు శ్రీ గుల్జారీలాల్ నందాగారు ఇచ్చటికి జులై 9 వ తేదీన వస్తారు. ప్లానింగ్ కమిషను తాత్కాలిక నివేదికను కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు చర్చించవచ్చునని తెలుస్తున్నది. ఏ. ఐ. సి. సి. సభ లాల్‌బాగ్ గాజు భవనములో జరుగుతుంది. మైసూరు ముఖ్యమంత్రి శ్రీ కె. సి. రెడ్డిగారు, హోం శాఖమంత్రి శ్రీ మరియప్పగారు ఈ భవనాన్ని దర్శించి, జరుగుతున్న యేర్పాట్లను తనిఖీ చేశారు.

## రెండుసార్లు మరణించిన మనిషి

### నూజవీడు హాస్పిటల్‌లో విచిత్ర సంఘటన

నూజవీడు, జులై 5: ఒక వ్యవసాయ కూలీ గతనెల 29 వ తేదీన చికిత్స నిమిత్తం స్థానిక గవర్నమెంటు హాస్పిటల్‌లో చేరాడు. ఆ సాయంకాలం 7 గం॥లకు రోగి మరణించినట్లు హాస్పిటల్ సబ్ అసిస్టెంటు సర్జన్ ప్రకటించాడు. వెంటనే దహన క్రియలకు తగు సన్నాహాలన్నీ చేసి, శవాన్ని శ్మశానమునకు తీసుకొని పోవుటకు ఉద్యుక్తులైనారు. కాని, సబ్ అసిస్టెంటు సర్జన్ ప్రకటించినట్లు అది మృతకళేబరము కాదని, యింకా ప్రాణముందని తెలుసుకొని ఆశ్చర్యచకితులైనారు. ఆ మరునాటి సాయంకాలం రోగి మరణించాడు. ఇది నిజమైన మరణమని అంతా ధృవపరిచారు. అయితే, అంతకుముందు సాయంకాలం, తను మరణించాననీ, దహనక్రియల నిమిత్తం తన్ను తీసుకుపోవుటకుగూడా వచ్చారని రోగికి తెలియుటచే ఆ బెంగతో నే చనిపోయాడేమోనని కొందరు అనుకొంటున్నారు.

## హేగ్ కోర్టు తీర్పు

(1 వ పేజీ తరువాయి)

వచ్చేవిషయమై బ్రిటిషు మంత్రివర్గం నేడు ఆలోచించినది.

సోమవారంనాడు ఆంగ్లో ఇరానియన్ కంపెనీ జనరల్ మేనేజర్ డ్రేక్‌తో జరిపిన సమాలోచనల సందర్భంలో పర్షియాలో బ్రిటిషు వాళ్లు గట్టిగా నిలబడాలనే బ్రిటిషు మంత్రివర్గం నిశ్చయించినది. కాని బ్రిటిషు సిబ్బంది మీద ఒత్తిడి ఎక్కువ వుతున్నట్లుగా పరి కొత్తివార్తలు తెలుపుతున్నవని విదేశాంగమంత్రి మారిజన్ నేటిసమావేశంలో తెలియజేశారు.

మారిజన్ నేడు కామన్సులో మాట్లాడుతూ బ్రిటిష్ ప్రభుత్వం పర్షియాలోని బ్రిటిష్ పౌరుల భద్రతను పరిస్థితులకువదిలి ఊరుకోదని స్పష్టపరిచారు.

### పర్షియాకు కొత్త ప్రతిపాదనలు?

నూనె టాంకర్ల అధికారులు అబాదాన్‌లో ఇవ్వవలసిన రసీదుల విషయమై వచ్చిన తగాదాలను పరిష్కరించే నిమిత్తం బ్రిటిష్ ప్రభుత్వం కొన్ని కొత్త ప్రతిపాదనలను చేయ నిశ్చయించినట్లు అభిజ్ఞవర్గాలు తెలియజేస్తున్నారని యు. పి. ఐ.-ఫ్రాన్స్ ప్రెస్ విలేఖరి తెలియజేస్తున్నాడు. ఈ ప్రతిపాదనలు నేడు బ్రిటిష్ రాయబారి షెపర్డ్ ద్వారా ప్రధాని మొసాదిక్‌కు అందజేయబడితవని అతడు సూచిస్తున్నాడు.

'ఆంగ్లో ఇరానియన్ కంపెనీ హక్కులకు భంగం కలిగించని పద్ధతిలో' అన్న వాక్యాన్ని రసీదులో చేర్చే పక్షంలో, పర్షియా జాతీయ నూనె కంపెనీ పేరనే రసీదులు ఇవ్వటానికి బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరిస్తున్నట్లు తెలుస్తున్నది.

### పర్షియాకు అమెరికన్ టాంకర్లు

"ఆంగ్లో ఇరానియన్ కంపెనీ టాంకర్లు ఉపసంహరింపబడితే టాంకర్లనూ, తదితర రవాణా సౌకర్యాలనూ సప్లయి చేయటానికి సిద్ధంగా ఉన్నామని కొన్ని పెద్ద అమెరికన్ కంపెనీలు మాకు చెప్పినవి. ఈ ప్రతిపాదనను పర్షియా ప్రభుత్వానికి పంపించాము." అని వాషింగ్టన్‌లోని పర్షియా రాయబారి కార్యాలయానికి చెందిన ఒక ఉద్యోగి నేడు వెల్లడించారు.

ప్రపంచంలోని పెద్ద టాంకర్ కంపెనీలలో రెండవది టాంకర్ల సప్లయికి మాట ఇచ్చినదని పర్షియా నూనె కమిషన్ సభ్యుడు అర్దలాన్ పార్లమెంటులో చేసిన ప్రకటనను వివరించటానికి ఈ ఉద్యోగి నిరాకరించారు.

ఎస్సో, నేషనల్ ఆయిల్ కార్పొరేషన్ మొదలైన కంపెనీలవారు యీ విషయమై తమ కేమీ తెలియదంటున్నారు.

పర్షియా ప్రభుత్వం నేటిరాత్రి అత్యవసర సమావేశం జరిపి అంతర్జాతీయ న్యాయస్థానపు తీర్పును చర్చించినది. దానిని పర్షియా నిరాకరిస్తుందని అభిజ్ఞవర్గాలు చెపుతున్నారు.

ఆంగ్లో ఇరానియన్ కంపెనీ టెహరాన్ ప్రతినిధి సెడాన్‌మీదా, కంపెనీ ప్రచారశాఖా డైరెక్టరుమీదా పర్షియా ప్రభుత్వ న్యాయవాది నేరారోపణ పత్రాలను తయారు చేసినట్లు 'ఎల్ తలాయత్' పత్రిక నేడు ప్రకటించినది.

## కేసాంగ్‌కు సమితి ప్రతినిధుల ప్రయాణం

(1-వ పేజీ తరువాయి)

లోనో ఏది ఎక్కువ వీలైతే దాంట్లో బయలు దేరివస్తారు. జీపులో బయలుదేరినా హెలికాప్టర్ లో బయలుదేరినా, సేవూల్ కేసంగ్ రోడ్డు వెంబడే ప్రయాణమై జులై 8 వ తేదీ ప్రొద్దున 9 గం.కు వారు ఇంజన్ నదిని దాటుతారు. దోవలో మా ప్రతినిధులకు మా సైన్యాలవల్ల ఎలాంటిప్రమాదం రానివ్వమంటూ మీ రిచ్చిన హామీ సంతృప్తికరంగా వుంది."

కమ్యూనిస్టులు సూచించినట్లు జీపులో గాక వీలైతే హెలికాప్టర్ లోనే తన ప్రతినిధులను పంపాలని రిడ్జ్‌వే కోరుతున్నాడు.

సేవూల్ విమానాశ్రయంలో ఒక పెద్ద హెలికాప్టర్ విమానాన్ని ఈ ప్రయాణంనిమిత్తం సంసిద్ధం చేస్తున్నారు.

ఈ వేళ కొరియాలో ఉభయపక్షసైన్యాలకు చెప్పవలసినంత పెద్దసంఘర్షణ లేమీ జరగలేదనీ, కమ్యూనిస్టుల కతిపయ్ కొట్లాటమాత్రం తీవ్రతరం అయినాయనీ అష్టమ సైన్యాధికారులు ప్రకటించారు. కమ్యూనిస్టు సైన్యాలు కేసంగ్ నుంచి క్రమంగా వెనక్కు తగ్గుతున్నాయి. కేసంగ్‌కు ఆగ్నేయంగా ఒక ఐక్యరాజ్య గస్తీదళానికి 15 మంది ఉత్తర కొరియన్ సైనికులకు కొద్దిసేపు పోరాటం జరిగింది. ఐక్యరాజ్య విమానాలుమాత్రం శత్రు స్థావరాలపై నిర్విరామంగా దాడ్చి సాగిస్తూనే వున్నాయి. క్రితంరాత్రి సమితి బాంబరుదళాలు 75 కమ్యూనిస్టు వాహనాలను ధ్వంసంచేశాయి.

### యుద్ధరంగంలో సంఘర్షణల ప్రజ్వలన

టోకియో, జులై 5: ఆదివారం నాటి తొలి సంప్రతింపులకు ఒకవంక సన్నాహాలు జరుగుతుండగా, రెండవవంక యుద్ధరంగాల్లో వుభయపక్ష సైన్యాలమధ్య వుండి వుండి సంఘర్షణలు ప్రజ్వలిస్తూనే వున్నాయి.

జనరల్ రిడ్జ్‌వే తన ప్రతినిధులుగా ఈ తొలి సంప్రతింపులకు ఒక దక్షిణకొరియా సైనికాధికారిని, ఒక అమెరికన్ భూసైనికాధికారిని మరో అమెరికన్ విమాన సైనికాధికారిని పంపవచ్చునని వదంతి వినవచ్చింది.అయితే ఈ వదంతి యింకా ధ్రువపడలేదు.

కేసంగ్‌కు ఈశాన్యంగా ఐక్యరాజ్య గస్తీదళాలకు కమ్యూనిస్టులకు ఈవేళ సంఘర్షణ జరిగింది. నిన్నటి గోజున ఐక్యరాజ్య సైన్యాలు కేసంగ్‌లో ప్రవేశించి ప్రతిపక్ష సైన్యాల కోసం వూరంతా గాలించాయి. కాని ఎక్కడా ఒక కమ్యూనిస్టు పురుగు కూడా కనిపించలేదు.

మధ్యరంగంలో ఛోర్వాన్‌కు పశ్చిమంగా కమ్యూనిస్టులు ఐక్యరాజ్య సైన్యాలమీద తిరుగుబాట్లు కొల్పారు. తూర్పురంగాన ఐక్యరాజ్య సైన్యాలు శత్రుసైనిక శ్రేణిలో రంగ్రాన్వేషణ సాగిస్తున్నాయి.

"అసలుయుద్ధమే విరమించటానికి దక్షిణకొరియాప్రభుత్వం అనటంలేదు. మేము కోరుతున్న దల్లా ఏమంటే 38వ అక్షాంశరేఖను యుద్ధ విరమణ సరిహద్దుగా చెయ్యకూడదని మాత్రమే" అని దక్షిణకొరియాప్రభుత్వ ప్రతినిధిఒకడు ఈవేళ ప్రకటించాడు.

38 వ అక్షాంశరేఖకు 110 మైళ్ళు ఉత్తరాన కొరియా భూభాగం గ్రీవాకారంగా సన్నగిలివున్న ప్రదేశంలో యుద్ధవిరమణ సరిహద్దు యేర్పాటు చెయ్యాలనీ, సరిహద్దు ఈప్రాంతంలో ఏర్పాటుచేస్తే దానిని రక్షించుకోటం సులభం అవుతుందనీ, ద. కొరియా ప్రభుత్వం అభిప్రాయ పడుతున్నట్లు ఆ ప్రతినిధి వెల్లడించాడు.

లండన్‌లోని దక్షిణ కొరియా ప్రతినిధి ఛియాంగ్ యిక్ ఈవేళ బ్రిటిష్ విదేశాంగ మంత్రి హెర్బర్టు మారిజన్‌ను కలుసుకొని యుద్ధ విరమణ రాయబారాలపట్ల దక్షిణకొరియా ప్రభుత్వం వైఖరిని వివరించినట్లు తెలుస్తున్నది.

దేశరక్షణార్థం సైనికశక్తిని పెంపొందించుకోటం అవసరంఅనీ, ఫార్మోజాకు విముక్తి కలిగించటం విమ్రపభుప్రధాన కర్తవ్యంఅనీ పెకింగు రేడియో ఈవేళ పునరుద్ఘాటించింది.

అమెరికన్లు కొరియాలో చావుదెబ్బలు తినబట్టే శాంతి సంప్రతింపులకు దిగారని పెకింగు రేడియో వ్యాఖ్యానించింది.

## రైల్వే పనివారికి నెహ్రూ హెచ్చరిక

(1 వ పేజీ తరువాయి)

వులకు గల బాధకములన్నియు న్యాయసమ్మతమైనను,కొకున్నను, యిప్పుడు దేశానికి అత్యవసరంగా సెరవేరవలసిన యీ సహాయమునకు అడ్డము రాకూడదని రైల్వేకార్మికులు కొలదికాలము ఆగవలెననియు నేను విన్నవిస్తున్నాను. కొబట్టి సమ్మెచేయవలెననే సంకల్పమును రైల్వే ఉద్యోగులు పనివాండ్లు అందరూ ప్రస్తుతము విరమించవలెనని మనవిచేయుచున్నాను. మీకుగల బాధకములను తొలగించుటకై రాయబారముల సంప్రతింపుల మూలంగా ప్రయత్నించుటకు గవర్నమెంటు సంసిద్ధంగానే ఉంది."

### నెహ్రూ వి. వి. గిరిగార్ల సమాలోచనలు

సింహళంలో యింతకు పూర్వము ఇండియా ప్రభుత్వపు హైకమీషనరుగా పనిచేసిన వి. వి. గిరిగారు ప్రధాన మంత్రియగు పండిత నెహ్రూగారితో కలిసి యీ వ్యవహారముగూర్చి ఆలోచిస్తున్నారు. రైల్వే కార్మిక సమితి వారు సమ్మెచేయుటకై నిర్ణయించుటకు పూర్వము కార్మికసమితి ప్రతినిధులు తిన్నె కలిసికొని మాట్లాడవలసినదిగా వారిని పండిత నెహ్రూ ఆహ్వానించవచ్చును.

సమ్మెచేయు విషయమై నిర్ణయం చేయుటకు రేపు కార్మికసమితి మండలి ఖర్గపూరులో సమావేశము కానున్నది. అనేక రైల్వే యూనియనుల తరపున 300 మంది ప్రతినిధులు హాజరయ్యేదరు. ఈ సమావేశమునకు జయప్రకాశ్ నారాయణగారు అధ్యక్షత వహిస్తారు.

జరుగబోయే సమ్మె లాంఛనమాత్రంగా ఒక రోజు మాత్రమే జరుగవలెనా లేక కార్మికుల కోరికలు యీడేర్చబడేవరకు సమ్మె జరుగవలెనా అనే విషయం యీ సమావేశంలో చర్చింపబడ వలెను.

### సంతానంగారి సూచన

అఖిల భారత రైల్వే కార్మిక సమితి ప్రధాన కార్యదర్శి యస్. యస్ గురుస్వామి గారికి రైల్వేశాఖ సహాయ మంత్రియగు కె. సంతానంగారు యిలా వ్రాశారు.

"సంప్రతింపుల ద్వారా కార్మికుల బాధకములను గూర్చి యోచించి పరిష్కరించుటకు గవర్నమెంటు సిద్ధంగానే ఉంది."

గురుస్వామిగారు యుపైటెడ్ ప్రెస్ విలేఖరితో యిలా అన్నారు: "జాయింటు సలహాసంఘమువారిచే 4 నెలలకిందటే జాబితా వ్రాయబడినవి. వాని నన్నింటిని పరిశీలించుటకై ముఖ్య వస్తుల విచారణ జరిపించుటకు గవర్నమెంటు సిద్ధంగా ఉన్నదా అనే విషయము సందేహంగానే ఉంది."

### రైల్వే కార్మికులకు శ్రీ గిరిగారి సలహా

మదరాసు, జులై 6: అఖిల భారత రైల్వే ఫెడరేషను వారు ఆర్థికం కలిగించే యేపనికిగాని తొందరపడి పూనకూడదని తమ కోర్కెల పరిష్కారానికి భారత ప్రధాని నెహ్రూ మధ్యవర్తిత్వము కోరి తమ సర్వవిషయములు ఆయన చేతుల్లో పెట్టటం మంచిదని శ్రీ వి. వి. గిరిగారు యీదినం యు. పి. ఐ. విలేఖరితో సంప్రతింపులలో విన్నవించారు.

## సంపాదకునకు లేఖలు

### వైద్యకళాశాలలో ప్రవేశం

ఆర్యా, మధుర, గుంటూరు పట్టణాలలోవున్న వైద్యకళాశాలల అభివృద్ధికిపున్న ప్రతి అవకాశాన్ని తప్పక వినియోగించగలమని ప్రభుత్వ ప్రతినిధులు పలుమారులు శాసనసభలోనూ, బయటనూ చెప్పుచున్నారు. వీరు చెప్పిన యీ మాటలో ఎంతమాత్రపు సత్యమున్నా యీ రెండు వైద్యకళాశాలలూ 1953 జూన్ నాటికి అభివృద్ధి కాగలవు. ఇప్పుడు చేరిన విద్యార్థులు అప్పటికి వుండబోయేది 3 వ సంవత్సరపు తరగతిలోనే కాబట్టి, యిప్పుడు మామూలుగా చేర్చుకొనే 300 మంది మాత్రమేకాక అదనంగా మరొక 100 మంది విద్యార్థులకు వైద్యకళాశాలలో ప్రవేశమీయవచ్చు. ఈ అవకాశాన్ని వినియోగించి, భారతి వైద్యసంఘం మద్రాసుశాఖాధ్యక్షుడు డా॥ డి. వి. సంకప్పగారు సూచించినట్లుగా,వైద్యవృత్తిలో వున్న వారి సంతతికి ప్రథమ నిధిగా ప్రవేశమీయవలసిందని అధికారులను కోరుతున్నాను.

గుంటూరు డా॥జి.వి.హనుమంతరావు
భారతీయ వైద్య సంఘ-ఆంధ్రశాఖ అధ్యక్షుడు.

### కొత్తికనుమ ప్రాజెక్టు అసాధ్యమా?

ఆర్యా, ఇటీవల పార్లమెంటు సభ్యుడు మోటూరి సత్యనారాయణగారు రు. 18 కోట్లు వ్యయపరచి పులిచింతల ప్రాజెక్టును నిర్మించితే గుంటూరు జిల్లాలోని కొన్ని మెట్టతాలూకాలు బాగుపడగలవని ప్రభుత్వానికి తెలిపి వున్నారు. ఎన్. జి. రంగాగారుకూడా పులిచింతల ప్రాజెక్టు నిర్మాణ మవసరమేనని పత్రికా ప్రకటనలు చేశారు. ఒక్క గుంటూరుజిల్లాలోని 'కొన్ని మెట్ట తాలూకాలకు' మాత్రమే వుపయోగపడగల పులిచింతల ప్రాజెక్టు నిర్మాణానికి రు 18 కోట్లు వ్యయపరచగలిగిన ప్రభుత్వం గుంటూరు, నెల్లూరు, కర్నూలు జిల్లాలకు పూర్తిగా వుపయోగపడగల కొత్తికనుమ ప్రాజెక్టుకు రు 20 కోట్లు వ్యయపరచలేదా?

కృష్ణా సంగమేశ్వరం ప్రాజెక్టు పేరిట ఆంధ్రదేశంలో ప్రవహిస్తున్న కృష్ణానీటిని తమిళజిల్లాలకు మరలించటం జరుగుతోంది. కనీసం యిట్టి దుస్థితి నివారించటానికైనా కొత్తికనుమ స్కీమును ప్రారంభించటం అవసరం. తరతరాలుగా వెనుకబడివున్న రాయలసీమ ఆంధ్రుల ఆర్థికాభివృద్ధికి యీ కొత్తికనుమ ప్రాజెక్టు మూలాధారం కాగలదు. ఈ విషయాన్ని గుర్తించి రాయలసీమ ఆంధ్రులు కొత్తికనుమ ప్రాజెక్టు నిర్మాణానికి ఆందోళన చేసి, రాబోయే తరాలవారి దారిద్ర్యాన్ని వారించుకోవలసిందిగా కోరుతున్నాను.

ఈదర: మంచళ్ల వెంకటేశ్వరరావు.

### లేఖాంశాలు

గుంటూరులో యిటీవల బియ్యపు రేషన్‌కార్డులతోపాటుగాపంచదారకుకూడా వేరే కార్డులు డిపోలద్వారా యిచ్చారనీ, ఒక్కొక్క కార్డుకు అణా, చేప వంతున వసూలుచేశారనీ త్రిపురమల్లు లక్ష్మయ్య గుప్తగారు తెలియచేస్తున్నారు. రేషన్‌కార్డుకు రుసుము విధించాలని ప్రభుత్వమే నిర్ణయించిందా అనే అంశంపై స్థానికాధికారులు సరియైన సమాధానం యీయనందున ప్రభుత్వమైనా తగు ప్రకటన చేయాలనీ ఆయన కోరుతున్నారు.

మంపలోయనుంచి ఎస్. సువర్ణకుమార్ గారు యిటీవల మద్రాసు ప్రభుత్వంవారు ఏర్పాటుచేసిన కొండజాతుల సలహాసంఘంలోని 16 మంది సభ్యులలోనూ కొండదొర, వీజెన్నివాల్మీకులు, సవరలు, గదబలు, కోదులు మొదలైన జాతులవారికి ప్రాతినిధ్యం యీయనందుకు తమ విచారాన్ని వెలిబుచ్చారు. కొండజాతుల అభివృద్ధికి ఈ జాతులవారికి ప్రాతినిధ్యం యీయటం ప్రధానమని ప్రభుత్వానికి తెలియచేస్తున్నారు.

శ్రీకాకుళంనుంచి ఉప్లాం నరసింహం పట్నాయక్ గారు నిర్బంధ విద్యావిధానముతోపాటుగా స్కూలు పిల్లలకు ఒక్కపూట భోజనమైనా వుచితంగా పెట్టవలసి వుంటుందని అంటున్నారు. ఎంత సంపాదించినా తిండికింజాలక చాలని యీ రోజులలో ముఖ్యంగా యింటిల్లిపాదీ పనులుచేసి పొట్టపోసుకొనే పేదవారికి యీ మాదిరి సదుపాయాలు వుంటేనే కాని నిర్బంధ విద్యావిధానం అర్థ సహితం కాదని విన్నవిస్తున్నారు.

ఎయిడెడ్ స్కూళ్లలో పనిచేసే హైయర్ గ్రేడ్ వుపాధ్యాయుల జీతాన్ని రు 25నుంచి 27కు పెంచుతూ మరొక రు 3/-లు యిమ్మని మేనేజర్లను ఆదేశించి, ఆ మూడు రూపాయలు యివ్వని మేనేజిమెంట్లను రద్దు చేస్తామని ప్రభుత్వం వుత్తరువు చేసిన ఫలితంగా మేనేజర్లు రు 3/-లు యీయకనే ముట్టినట్లుగా వుపాధ్యాయులచేత సంతకాలు పెట్టించుకొంటున్నారని 'ఒక ఉపాధ్యాయుడు' తెలియచేస్తున్నారు. ప్రభుత్వాధికారులు తగు విచారణలు జరిపి యీ దుస్థితి తొలగించమని వేడుకొంటున్నారు.

సఖినేటిపల్లి-పాలకొల్లు వుండి మధ్య తిరుగుతున్న 6 బస్సులు ప్రయాణీకులను చాలటంలేదనీ, యీ బస్సులు నిర్ణీతకాలాలలో కాక యిష్టంవచ్చినట్లు తిరుగుతున్నందువల్ల ప్రతి ప్రయాణీకుడు బాధపడవలసి వస్తున్న మితిలేని ప్రయాసను నివారించవలసిందని గోటేటి సుందరరావుగారు(మోరి) ...కలవారి కందరినీ వేడుకొంట

## ప్రకటన

ఈ ఫోటోలో నున్న శవము సంగం జాగర్లమూడివద్దనున్న కొమ్మూరు కెనాలు గట్టు చేబ్రోలు సరిహద్దులో ది 8-6-51 వ తేదీన పడివున్నది. ది 10-6-51 వ తేదీన పొన్నూరు సర్కిలు యిన్స్పెక్టరుగారు ఈ విషయంతెలిసి అక్కడకు వెళ్లగా అక్కడిస్థితినిబట్టి ఈవ్యక్తి ఉరి తీయబడి నట్లును ఈమె రేవల్లెతాలూకా జేపూరి అనంతారం కాపరస్థురాలనియు ఈమె పేరు నాగరత్నమ్మ అనియు తెలియవచ్చు చున్నది. ఈమె తాలూకా యింతవరకు ఎవరు రాలేదు కనుక యీమె తాలూకు రక్తబంధువులుగాని, స్నేహితులుగానీ పొన్నూరు సర్కిలు యిన్స్పెక్టరుగారైన ఎం. లక్ష్మణరావుగారికి తెలియపరచవలెను.

## టెండరు నోటీసు

ఏలూరు మునిసిపాలిటి, ఏలూరు

ఏలూరు మునిసిపల్ వాటర్ వర్క్సు స్టీం బొయిలర్ మరమ్మతులకు సీలువేసిన టెండర్లు ఏలూరులోని ఏలూరు మునిసిపాలిటీ కమీషనరు ...

## టెండరు నోటీసు

ఏలూరు మునిసిపాలిటి, ఏలూరు

## నోటీసు

బాంబే మ్యూచువల్ లైఫ్ అష్యూరెన్సు సొసైటీ లి.

## మద్రాసు వార్తలు

కోయంబత్తూరుజిల్లా జాతీయముస్లిముల రాజకీయ సమావేశం ఈనెల ఆఖరువారంలో జరుగుతుందని ప్రకటించబడింది. సమావేశాన్ని డా॥ సుబ్బరాయన్ ప్రారంభిస్తారు. షఫీ మహమ్మద్ అధ్యక్షత వహిస్తారు.

* * *

రాజపాలయం డిస్పెంసరీని ఆస్పత్రిగా మార్చి ప్రభుత్వం అందుకు అవసరమగు సిబ్బందిని నియమించింది.

* * *

విశాఖపట్నం కాలేజీలో 1951 జూలై 2 నుండి ప్రారంభించే శానిటరి ఇన్స్పెక్టర్ల తరగతి నిర్వహణకు ప్రజారోగ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు హోదాలో ప్రొఫెసరు ఉద్యోగమును ప్రభుత్వమువారు మంజూరు చేశారు.

పబ్లిక్ హెల్తు శాఖలో సంఖ్యా విభాగమును సంస్కరించుటకు గాను ప్రభుత్వము గెజెటెడు హోదాలో ఒక సంఖ్యా సంకలన ఉద్యోగినినియమించుటకు మంజూరుచేసింది.

### పంచాయితీ బోర్డులు

### హిందీ మేళ

### ఇండియన్ మ్యూచువల్ లైఫ్ అసోసియేషన్

### మధురదగ్గర కాంగ్రెసు-ద్రవిడకళగం కొట్లాట

### ఈడుగుమిల్లి కరణంగారి భార్యకు ప్రభుత్వ సహాయం

### నేపాల్లీలకు రెండుకోట్ల సహాయం

## ఇండో - అమెరికను సంఘం

మదరాసు, జూలై 5: ఇండో అమెరికను సంఘం నిన్న మెరీనా కేంటీన్ లో జరిగినసభయందు స్థాపించబడెను. సభ ప్రారంభోత్సవం శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు జరిపారు. ప్రధాన న్యాయమూర్తి పి. వి. రాజమన్నారు, ఎం. భక్తవత్సలం, ప్రిన్సిపాలు ఎస్. పాలు మున్నగు పెద్దలు పలువురు సభకువచ్చారు. బాపినీడుగారు స్వాగతిమిస్తూ, యిట్టిసంఘముస్థాపించుట ఇండియా అమెరికాల సఖ్యతకు ఎక్కువగా తోడ్పడుననిరి.

అమెరికా స్వాతంత్ర్య వార్షికోత్సవం నాడే యీసంఘం స్థాపించబడుట ముదావహమని డా॥ టి. ఎం. పి. మహాదేవనుగారు నుడివిరి.

అమెరికా ప్రచురణ శాఖాధికారి ఎస్. ఆర్. చర్రింగుగారు యిట్టి సంఘం స్థాపించుచున్నవారికి అందరు తోడ్పడాలన్నారు. అమెరికా ఇండియాలకు సారూప్యం ఎక్కువగనుంది. అమెరికనులు భారతీయ వేదాంతవిజ్ఞానములను ఎక్కువగ అర్థం చేసుకొని, ...

### రాజాజీ శ్రీపెరంబుదూరుయాత్ర

### కళాశాల స్థాపనకు డిపాజిట్లు

### క్రైస్తవ మిషనులకు మినహాయింపు వుండదు

### తమిళనాడు ప్రజాపార్టీ

### నూతి వ్యవసాయ సౌకర్యాలు

### కేంద్రానికి ప్లానింగు కమిషను సిఫార్సు

## వనమహోత్సవాలు

గుంటూరు, జూలై 2: నిన్న వుదయం జిల్లాకలెక్టరు పి. పి. ఐ. వైద్యనాథన్ గారు అన్ని ఆఫీసులలోను బంగళాలలోనూ మొక్కలునాటి వనమహోత్సవం ఆరంభింపచేశారు. మునిసిపల్ ఆఫీసులో వుపాధ్యక్షుడు సలాంగారు మొక్కలునాటారు.

### శ్రీకాకుళం

స్థానిక హైస్కూలు భవనంలో జిల్లాకలెక్టరు షేక్ మహమ్మద్ గారు వనమహోత్సవం జరిపారు. కలెక్టరుగారి అధ్యక్షతన జరిగిన బహిరంగసభలో భగీరథపాడీ, బి. కృష్ణమూర్తి పంతులు, వి. నరసింహంగార్లు వుపన్యసించారు.

### బందరు

ఈ 1, 2 లలో పురపాలక సంఘాధ్యక్షుడు డా॥ ఆర్ అచ్యుతరామయ్యగారు తమ సిబ్బందితో కలిసి నేషనల్ కాలేజి రోడ్డు, కొంటోన్మెంట్ రోడ్డులలో మొక్కలు నాటారు. జిల్లాబోర్డు ఆఫీసు ఆవరణలో కాకాని ...

### తాడేపల్లి

### మద్రాసు

### గుంటూరులో 'పట్టాభిపురం' ప్రారంభోత్సవం

### ఎక్. జె. ఒ. క్లబ్ నూతన భవనం

### రైల్వేలకు బొగ్గు సరఫరా ప్రత్యేకంగా నౌకలు

### జెక్ హెల్త్ చెబువు

## బరంపురం మునిసిపల్ ఎన్నికలు

### పోటీలేకుండా చేసుకొనేందుకు పౌరుల కృషి

బరంపురం, జూలై 2: వచ్చే మ్యునిసిపల్ ఎన్నికల విషయమై పోటిలేకుండాఎన్నికలుజరపాలని, తెలుగు, ఓఢ్ర అనే విభేదాలు మరచిపోయి, కేవలం పౌరక్షేమంకోరేవారి నే ఎన్నుకోవాలన్న ఉద్దేశం పలుకుచ్చుతూ, కొన్నాళ్ళ క్రిందట యేర్పాటయిన కమిటీ వారిచే, నిన్నను టవున్ హాలులో పి. సి. చటర్జీగారి అధ్యక్షత్రక్రింద ఒక బహిరంగసభజరుపబడినది. అంతకుముందు యిచ్చటి ఉత్కళ్ క్షేమంలో కొందరు ఓఢ్రనాయకులు ఇదే ఉద్దేశంతో ఏర్పాటుచేసిన ఒక కమిటీకి చెందిన కొందరు ప్రతినిధులుకూడా యీ సభకుహాజరయినారు. ఇరుపక్షాల వారు వాగ్వాదంలోకి దిగారు. ఉపన్యాసకులమాటలు శ్రోతలకు బోధపడకుండా, సభలో ఈలలు, నినాదాలు, ...

## నెల్లూరు జిల్లాలో అధికాహారోత్పత్తికృషి

### స్థానికాధికారులతో కొండి రామమూర్తిగారి చర్చ

### గుంటూరుజిల్లాలో రాజకీయ బాధితులకు భూములు

### ఇంతవరకూ 1400 మందికి మంజూరు చేయబడిన పట్టా

## కర్ణాటకసంగీత పరిషత్తు

### నాలుగు రాష్ట్రాల మంత్రుల సమావేశం

## క్రమశిక్షణ, శ్రద్ధాసక్తులు పెంపొందించుకోవాలి

### విద్యార్థులకు మంత్రి గోపాలరెడ్డిగారి హితవు

### చీరాల కళాశాల ప్రారంభోత్సవ వివరాలు

చీరాల, జూలై 4: ఇచట శ్రీ కోటు కూరి రామయ్య శ్రేష్ఠి కళాశాలకు మద్రాసు రాష్ట్రీ ఆర్థిక మంత్రి గా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు, మొన్న ప్రారంభోత్సవం జరుపుతూ, విద్యార్థులు వక్రమార్గాలను విసర్జించి, శ్రద్ధాసక్తులు పెంపొందించుకొని క్రమశిక్షణకు బద్ధులైఅభివృద్ధిలోకి రావలెనని, తెలుగు విద్యార్థులు, యితర ప్రాంతాల విద్యార్థులతో దీటుగా ఉండవలెను గాని వెనుకబడి ఉండుట తగదని హితవుబోధించారు.

[కళాశాలప్రారంభోత్సవ వృత్తాంతము జూలై 3 వ తేదీ పత్రికలో సంగ్రహంగా ప్రచురించాము.]

## దేశపారిశ్రామికాభివృద్ధి

### శ్రీ కస్తూరిభాయ్ లాల్ భాయ్ సూచనలు

అహమ్మదాబాద్, జూలై 6: ప్రభుత్వం వారికి సుస్థిరమైన, నిర్దుష్టమైన దీర్ఘకాలికమైన పారిశ్రామిక విధానం అంటూ ఒకటి లేనందువల్ల దేశంలో పారిశ్రామికాభి వృద్ధి దెబ్బతిన్నదని శ్రీ కస్తూరిభాయ్ లాల్ భాయ్ గుజరాతీ వాణిజ్య మండలి సమావేశంలో మాట్లాడుతూ ఉద్ఘాటించారు.

ప్రభుత్వంలోవున్న వారు ఈ విధానాలను గురించి, తలో విధంగానూ మాట్లాడుతూ వున్నందు వల్ల పారిశ్రామికులలో ఉత్సాహం చచ్చిపోతున్నదని ఆయన అన్నారు.

కంట్రోళ్లను గురించి మాట్లాడుతూ వాటిని అమలు జరుపుతూ వున్న పద్ధతి మూలంగా ఉత్పత్తితగ్గిపోతున్నదని, శ్రీ కస్తూరిభాయ్ అన్నారు. దేశం పారిశ్రామికంగా అభివృద్ధిలోకి రావాలని ప్రభుత్వం వాంఛించే పక్షంలో వారు తమ ఆర్థిక ...

## మదరాసు ధరలు

